పురుషులు గడ్డములు పెంచనందున వీరికిని, స్త్రీలకును భేదము సులువుగా తెలిసికొనుట క్రొత్తవారికి అసాధ్యము. వీరు కేశములను కత్తిరించుకొనక స్త్రీలవలె చైనీయపద్ధతిని జడవేసికొందురు. వీరిలో నొకస్త్రీకి పలువురు భర్తలుందురు. ఒకయింటి యన్నదమ్ములలో అన్న వివాహముచేసికొనిన కొన్నిదినములకు తమ్ములకు గూడ నాస్త్రీ భార్యయగును. ఇంటియజమానునికి భార్య మృతిజెంది, కోడలున్నచో అదిగూడ వాని భార్య యగును. ఎవఁడేని పురుషుఁడు ఎదిగిన కొమార్తెలతోడి స్త్రీని (బిడ్డలతల్లిని) వివాహము చేసికొనినచో ఆకొమార్తెలును వాని భార్యలే యగుదురు. ఈపట్టున రోమా రోలండుగారు వ్రాసిన స్వామి వివేకానందులవారి జీవితచరిత్రమునందలి యొక చిన్నియుదంతము స్మరణకు వచ్చుచున్నది. స్వాములవారు హిమాలయములో టిబెట్టు దేశస్థులజాతికి చెందిన ఆఱుగురు సోదరుల యింట నాతిథ్యమందుచుండిరి. ఒకస్త్రీయే వారికందరికిని భార్యగా నుండెను. స్వాములవారు వారికి అది దురాచారమని తెల్ప ప్రయత్నింపఁగా దానికి ఆసోదరులు 'ఏమి మీ స్వార్థపరత్వము - ఒకస్త్రీని సంపూర్ణముగా నొకరే కాఁజేయవలయుననీ!' అని ఉత్తర మొసంగిరఁట. ఇట్లు పర్వతము పాదప్రదేశమున నేది తప్పో, అది శిఖరమున నొప్పుగా గణింపఁబడుచున్నది.

## గృహములు

కట్టడములు ఈస్థలములో బండరాళ్లతోను, కలపతోను నిర్మింపఁబడుచున్నవి. కొంచెముక్రింద సమప్రదేశమున పెడుళ్లతో, ఇటికరాళ్లతో చేర్చికట్టుదురు. వీరికి సున్నము లేదు. ఇండ్లలో శిల్పపుపనులుగూడ చేయుచున్నారు. టిబెట్టుదేశస్థుఁడగు గొప్పకాపరియిల్లు పదియడుగుల చదరము కలిగి నాలుగడుగులలోతు కలిగి, మట్టిచే అలుకఁబడియుండును. పైనకప్పు నీరు లోనికి దిగకుండునట్లు దట్టముగా యాక్ మృగముయొక్క రోమములచే కప్పఁబడియుండును. వీరు మట్టిప్రొయ్యిలో వంట చేసికొందురు. బుద్ధవిగ్రహమును పీఠమందుంచి నిత్యము పూజలు సేయుదురు.

## వీరి నృత్యములు

ఈదేశస్థులు అన్నికర్మలకును లామాపద్ధతి నృత్యమునుగాని, పిశాచనృత్యమునుగాని ఆడుదురు. అట్టిసమయములలో పురుషులు మొగములకు మారువేషములు వేసికొని పెద్దయిజారులు ధరించివత్తురు. వారు నాట్యమున తిరుగుటలో ఆ యిజారులనిండుగ గాలి దూరి అవి బూరటించుకొని పెద్దవిగ గన్పడును. స్త్రీలు చుట్టును కుచ్చులను కట్టుకొని గొడుగులవలె నవి లేచుచుండఁగా గిరగిర తిరుగుచు నృత్యములు సేయుదురు. వీరి వాద్యవిశేషములు తప్పెటయు ఇత్తడిచేతాళములుజత. ఈప్రదర్శనమంతయు చూచుటకు భయంకరముగానుండును. టిబెట్టుదేశస్థులవలెనే యుండు భూటియావారుగూడ అపరకర్మలలో నీవిధమైన నృత్యము లాడుదురు. మరణించిన తృతీయదినము అందరుచేరి కట్టెలు ప్రోవువైచి దానికి నిప్పంటించి దానిచుట్టును తాము ఎడమచేత డాలును కుడిచేత కత్తిని ధరించి నృత్యము సలుపుదురు. వీరికి బెల్లమును, బియ్యమును చేర్చి యొకవిధమైన సారాయి తయారుచేసి ఒకఁడు పోయుచుండిన వీరు త్రాగుచు ఒడలు తెలియక ఆడుదురు.

## భగవదారాధనావిధానము

వీరు సందులలో బుద్ధుని బొమ్మచెక్కి బుద్ధమంత్రమును చెక్కి ప్రతిష్ఠచేసియున్నారు. తమగ్రామమునకు పిశాచములవలని బాధ లేకుండుటకై వీరు మూఁడురాళ్లను గ్రామమువెలుపల నుంచుచున్నారు. ఆశిలలు పిశాచముల రాకకు అడ్డఁట. ఇందులకై వీరు పిశాచోచ్చాటనలను గూడ చేయుచుందురు. రోగములు జనులకు పిశాచములచే కలుగునని వీరి తలంపు. రోగములను మంత్రములు వేసియు, నచ్చట దొరకు మొక్కలచే మందులుచేసికొనియు నివారించుకొందురు.

కంచరగాడిదెలను తోలుకొని పోవువాండ్రు తమకు దారులలో అపాయములు రాకుండుటకై దేవునికి పర్వతశిఖరములపై కొన్ని బుద్ధమంత్రములు వ్రాసిన జెండాల నుంతురు. అవి ఎన్నిసారులు గాలిలో కదలిన

అన్నిసారులు తాము జపించిన ఫలము నందితిమని వీరు తలంతురు.

ఈప్రదేశములలో ఎరుపురంగు పూసిన రాళ్లను, చిన్నచిన్నమంత్రములు వ్రాసిన జెండాలును పవిత్రము దుము. కొన్నిరాళ్లమీఁద బౌద్ధమంత్రములను వ్రాసి యుంతురు. ఇచ్చట పువ్వులు దొరకని కారణముచేత వీరు దేవునికి చిన్న చిన్న రాళ్లను సమర్పింతురు. అవైపుపోవు ప్రతివాఁడును దేవునికి ఒకటిరెండు రాళ్లను సమర్పించిపోవును. 'ఓమ్ మని పద్మే హుమ్' అను మంత్రమును గోడలయందును, రాళ్లపైనను, గుళ్లయందును, మంత్రచక్రములయందును (Prayer-wheels), గాలిచే తిరుగు చక్రములపైనను, నీటియంత్రములపైనను వ్రాసి యంత్రములచేతనే దైవప్రార్థనలను జరుపుచుందురు. పలుమార్లు మంత్రమును జపించుటకంటె నాచక్రమును ఒకమాఱు కదిపిన నది పలుమారులు తిరుగునుకదా! సాయంకాలము కాఁగానే పనులను మానివేసి ఖాళీస్థలములలో చేరి భూమిపై సాష్టాంగములుపడి యంత్రములతో భగవత్ప్రార్థనలను చేయుదురు. వసంతకాలమునందు జరుగు వీరి పండుగలకు వీరి లామాసన్యాసులు పట్టుబట్టలతో నతిభయంకరము లగు వేషములు వేసికొని వత్తురు.

---

## అయర్ ఇటామ్ దేవాలయము, పినాంగు

(సచిత్రము)

(Aier Itam Temple)

సుమారు క్రీ. శ. ౧౬౦౦ కు పూర్వము ఈబౌద్ధదేవాలయము నిర్మింపబడినది. ఈయాలయమునిర్మాణము పట్టణమునకు సుమారు నాలుగుమైళ్లదూరమున, సుమారు వేయి యడుగుల యెత్తుగల కొండపయిన. ఈకొండ యడుగువరకు పట్టణమునుండి రమణీయములగు పుష్పవాటికలు, నారికేళవనములగుండా ట్రాములు పోవును. క్రీ. శ. ౧౮౭౬-వ సంవత్సరము నాటికి దేవాలయమునకంత వ్యాప్తి యుండినదిలేదు. క్రమముగా పినాంగులో జనసంఖ్య హెచ్చినకొలది యీయాలయముకూడ వ్యాప్తి గాంచజొచ్చినది. నేఁడిది వివిధజాతులవారికి ముఖ్యతీర్థముగ పరిణమించినది. ప్రకృతము కానవచ్చు నీయాలయము సుమారు ఇరువది సంవత్సరములకు పూర్వము కొందరు లక్ష్మీపుత్రులు చైనాదేశీయులు కట్టినది. ఈనూతనాలయము ప్రాతదానికి ౩౦౦ అడుగుల ఎత్తున నున్నది. రెంటికిని చేరికగా మనోహరములగు పూలతోటలు, కొలకులు, యాత్రికసౌకర్యమునకయిన గ్రంథాలయములు, విశ్రాంతిభవనములును నెలకొల్పబడి యున్నవి. ఈ నూతనాలయమున కేడంతస్తులు. చిట్టచివరి (౨-వ చిత్రములో బాణరేఖగలది) దాని నెక్కి-చూచిన పినాంగు అంతయు గానవచ్చును. ఆలయప్రాంతముల పెద్దపెద్ద రాళ్లపై చైనాలిపితో బుద్ధస్తోత్రము చెక్కఁబడియున్నది (౪-వ చిత్రము). ఆలయమందలి తలుపులు, అలమారలు మొదలగువాని శిల్పము మిక్కిలి సుందరము.

ఈయాలయమున నొక విశేషముగలదు. ఏదేని కార్యము నర్థించి, యందువిషయమై జయాపజయములను తెలియఁగోరువారు ఇందలి బుద్ధవిగ్రహమునెదుట పాచికలను వైతురు. దారవములయిన యీపాచికలు కలాచంద్రాకారములై అయిదంగుళముల పొడవును, ఒకటియునర అంగుళము వెడలుపును గలిగియుండును. ఈ పాచికల పాటునుబట్టి వారు తమకార్యముల సిద్ధ్యసిద్ధులను గుర్తింతురు. ఈసంచికయందు దేవాలయమునకు సంబంధించిన చిత్రములుగలవు. వాని వివరణము:—

౧. అయర్ ఇటామ్ దేవాలయ దృశ్యము
(కొండ అడుగునుండి)

౨. ఆలయపు మరియొకదృశ్యము
(సమీపమునుండి)

ఇందు కొండ అడుగునుండి ఆలయపు పైభాగమువరకు గల సోపానమార్గము చూడవచ్చును. ఆలయపు ప్రతి అంతస్తు చలువరాయి, దారువు, వెండి, బంగారు మొదలయినవానిచే నిర్మితములయిన బుద్ధప్రతిమలతో నిండియున్నది. అందు పెద్దది మొదటి యంతస్తునగలదు.

౩. శుద్ధోదకసరస్సు

ఇది కమలసరస్సునకు పైన, పుష్పవాటికకు దిగువను కలదు.

౪. బుద్ధస్తవశిల

ఇందు చైనాలిపిలో బుద్ధస్తవము చెక్కబడి యున్నది.

౫. మహావిగ్రహము

ఇది ప్రథమాలయమున గలదు. దీనికివెనుక సోపాన మార్గము గలదు.

౬. మహావిగ్రహపాలకులు

౭. కమలసరస్సు

దీని వ్యాసము ఇరువదియైదు అడుగులు. ఇందు లెక్కకుమించిన తాబేళ్లు పెంపబడుచున్నవి. ఈ సరస్సు ప్రథమాలయమునకు వెనుక నున్నది. దీనికి శుద్ధోదకసరోవరమునుండి నీరు పారును.

౮. ఆచార్యభవనములు, త్రిపిటక గ్రంథాలయము, పూర్వాచార్యులయు, ఆలయోద్ధారకులయు ప్రతిమలు.

---

# ఆశీర్వాదములు

అధికార్ల సూర్యనారాయణరావు గారు, బి. ఏ., బి. యల్.

కష్టముల కోర్చి సఖ్యంబు కాంతు సేయు
భ్రమరములకు దివ్యామృతరసము లిచ్చి
చిన్ని చిన్ని స్వర్గంబుల వన్నెతోడ
పర్వ మొనరించు పూల నాశీర్వదింతు !

కన్నుల వసంతరాగ భాగ్యములు గనుచు
చివురుటాకుల మేయుచు జెలువు గూడి
వలపుపాటలు గాలిలో వెలుపుచుండు
చిరుతకోయిలకన్నె నాశీర్వదింతు !

భావి గూర్చి విచారించు బాధలేక
నెమ్మదిగ నాట సాగించు బొమ్మ లేమొ,
తన కులుకులేమొ, తానేమొ, తల్లియేమొ,
చింతలే లేని బాలు నాశీర్వదింతు!

కష్టతాపం బెరుంగని కన్నులందు
వలపువెన్నెల గాయంగ ప్రాణనాథు
మోమునీమనె దినమెల్ల ప్రొద్దుపుచ్చు
చిన్నిజానకి! నిన్నె యాశీర్వదింతు !

---



# విమర్శనము



## అహింస

గ్రంథకర్త:—బాలా రంగస్వామిగారు, డెమ్మీ సైజు, మెరుపుకాగితాలు, ౩౦ పుటలు, కాగితపుఅట్టలు, వెల ౦-౮-౦.

ఇదొక చిన్న కవనపుస్తకం. ఈ పుస్తకంలో రెండుభాగాలున్నాయి. మొదటి భాగమంతా పాటలు, రెండోభాగమంతా గీతపద్యాలు.

అహింసను బోధించడంలో గ్రంథకర్త వొక కొత్తపద్ధతి అవలంబించేరు. ఆయాజీవులచేతే ఆయా జీవులు పడేకష్టాలు చెప్పించేరు. ఈపాటలు చదివిన యెవరైనాసరే మనలాంటి జీవమే గల యీ జీవుల్ని యేమాత్రం బాధపెట్టచూడమంటారు. మనస్సులో యింకా కనికరం కలిగి అలాగ బాధించే ప్రజలు మనుష్యులు కారని చెప్తారు. జనులు సామాన్యంగా తమ ఆహారంకోసమే చంపేజీవులచేత వాటిబాధలు చెప్పించబడ్డాయి, పశువులు, మేకలు, గొర్రెలు మొదలైన జీవులు.

ఈపాటల్లో భావాలు చాలాలోతుగా వున్నాయి. కవియొక్క అసామాన్య ప్రజ్ఞ గ్రంథమంతటా కనబడుతూంది. ఈ పుస్తకంలోని రెండోభాగంలోవున్న గీతపద్యాలుకూడా అహింసనే బోధిస్తున్నాయి. గ్రంథకర్తయొక్క కవనశైలి చాలా సరళంగా వుండి, శక్తి కలిగివుంది. గ్రంథంలో అక్కడక్కడ చిన్నచిన్న తప్పులు కనబడుతున్నాయి. అచ్చుతప్పులని అనుకుంటాను. ఈ గ్రంథాన్ని చదివి గ్రంథకర్తచేసిన బోధను గ్రహించి, అహింసయొక్క వుత్కృష్టతను తెలుసుకుని ప్రజలు పాలిస్తారుగాక.

ఈగ్రంథం కావలసినవారు:—గ్రంథకర్త పేర, కంబాల చెరువు, రాజమండ్రీ అని వ్రాయాలి.

జే. శా.

---

## శివతత్త్వరత్నాకరము

గీర్వాణభాషలో నెలయు నొక యపూర్వవిజ్ఞానకోశ మిది. విజ్ఞానకోశము లిప్పటికే యీభాషయందు కొన్ని కలవు. కాని యవియన్నియు పరిమితవిషయములనే బోధింపగలిగినవై యున్నవి. సకలవిషయములు గల కోశ మొకటియు నిప్పటికి లేదనియే యనవలసియున్నది. నేటికి శివతత్త్వరత్నాకర మబ్బినది. ఇది సకలతంత్రముల సారము. అనేకగ్రంథముల–అందు నేటికి కొన్ని ప్రకటితములు, కొన్ని అప్రకటితములు, కొన్ని అసలు వినష్టములు — నుండి యనేకవిషయము లిందు సంగ్రహింపబడినవి. ఇట్టి విజ్ఞానకోశమువలన పండితులకును, భాషాపరిశోధకులకును, విద్యార్థులకును, వీరికి వారి కననేల వాఙ్మయాభిమానుల కెల్లరకును ఎంతేని ప్రయోజనము గలదు. చీటికిమాటికి ఆపుస్తకము ఈపుస్తకము వెదుక నక్కరలేకుండ ఇదియే వారికి సకలార్థముల నిచ్చుచుండును.

ఏతత్సంగృహీత కెళది బసవరాజు. ఇతనికి హిరియ బసవరాజనియు పేరు గలదు. ఈ కెళదిరాజులు కన్నడ రాష్ట్రములో చాలభాగమును సుమారు ౨౫౦ సంవత్సరములు చక్కగ పాలించి పేరువడసినవారు. వీరు వీరశైవులు. ఈవంశమువారు నేటికిని కర్నాటదేశమున గలరు. ఈరాజవంశమునకు మూలపురుషుడు కెళది బసవప్ప. అతనికి పదునాలవవాడు మన బసవరాజు. ఇతడు

క్రీ. శ. ౧౬౯౮ మొదలు ౧౭౧౫ వరకు పదునేడువత్సరములు రాజ్యము చేసెను. బసవరాజు గొప్పపండితుడు; శివాద్వైత విద్యాధికారకుడు. ఈయన తండ్రి సోమశేఖరుడు; తల్లి చెన్నమాంబ; గురువు చెన్నవీరుడు. ఈ పండితరాజు లోకహితమునకై సకలతంత్ర సారభూతమగు నీగ్రంథమును రచించెను. ఇది బహుశః క్రీ. శ. ౧౭౦౯ ప్రాంతమున రచింపబడినదని యూహింపనగును.

గ్రంథరచనయందు బసవరాజు గైకొన్న మార్గమత్యద్భుతము. ఒకవంక వివిధవిషయవిజ్ఞానమును దెలుపవలయునని, మరియొకవంక తన పూర్వుల యపదానముల దెలుపవలయునని యతని తలంపు. తన పూర్వులచరిత్రనే ప్రధానముగ గొని వ్రాయుచో నాధునికులు తన గ్రంథము వంకకు బోరేమో అని సందేహము. కావున తనపూర్వులచరిత్రను సందర్భోచితముగ నారంభించి యెంతో విచిత్రముగ సాగించుచు వచ్చినాడు. ప్రతిపిపాదయిషితార్థములకును తనపూర్వుల చరిత్రకును సంబంధము గూర్చినాడు.

ఈ గ్రంథరాజమునకు రావుబహాదుర్, హెచ్. కృష్ణశాస్త్రిగారి మున్నుడియు, మానవల్లి రామకృష్ణ కవిగారి కృతివిమర్శయు గ్రంథారంభమున కలవు. ఇవిరెండును ఏతద్గ్రంథముయొక్కయు, సంగృహీత బసవరాజుయొక్కయు పరిచయమున పాఠకులకు మిక్కిలి తోడుపడగలవు.

ఈగ్రంథమున మొత్తము ౯ కల్లోలములు. ఒక్కొక్క కల్లోలమున కొన్ని తరంగములు, మొత్తము ౧౦౮ తరంగములు. ప్రతికల్లోలాంతమున సంగృహీత ఆకల్లోలమందు ప్రతిపాదితములైన విషయములకయి తాను పరిశీలించిన గ్రంథములనామముల జేర్కొని యున్నాడు. ఆపట్టికలను జూచినచో నితని యద్భుత పరిశీలనాశక్తి గోచరమగును.

ఇందలి విషయవిభాగము సంగ్రహముగ నిట్లు—

మొదటి కల్లోలము:—

౧. వేదాగమాంతర్గతసకలవిద్యలు, ౨. తత్త్వరూపము, ౩. అనాదిభక్తనిరంజనజంగమస్వరూప సృష్టిక్రమము, ౪. శూన్యనిష్కలమహాలింగాది సృష్టిక్రమము, ౫. ప్రణవలింగస్వరూపతదుత్పన్న వర్ణకలా స్వరూపములు, ౬. నాదతత్త్వత్రయ ద్విపంచాశన్మూర్తి భేదములు, ౭. విరాట్పురుషాది మూర్తిత్రయస్వరూప తత్త్వప్రభేదపంచీకరణవిభాగములు.

రెండవ కల్లోలము:—

౧. బ్రహ్మాండము, తదన్తర్వర్తి లోకములు, తత్ప్రమాణము, నవవిధసర్గలు, ౩౨ నరకములు, ౨. వివిధనరకస్వరూపము (నరకయాతనలు), (౩) దుష్కర్మజన్మరోగములు, తద్హేతుపాపములు, ౪. సప్తపాతాళ లోకములు, తద్వాస్తవ్యులు, (౫) సప్తద్వీపములు, దేవభూమి, లోకాలోకము, సప్తసముద్రములు, మేరువు, ౬. తత్కులకేసరాచలవర్ణము, ౭. జంబూద్వీపమందలి నవ ఖండములు, (౮) తక్కిన ఆరు ద్వీపములు.

మూడవ కల్లోలము:—

౧. మేఘాశ్రయ గ్రహలోకములు — భువర్లోకము, స్వర్లోకము, మహాలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము, ౨. మేఘగర్భోత్పత్తి ప్రసవములు, విద్యుత్స్ఫలితములు, నవమహామేఘములు, ౩. గుహ్యకగంధర్వ విద్యాధరాప్సరోలోకములు, సూర్యరథగతి, ౪. సూర్యగతి జనితకాలభేదము, గ్రహగతి, రాశిచక్రభ్రమణము, ధ్రువలోకము, ౫. భువర్లోక సువర్లోక మహాలోక జనలోకములు, ౬. తపోలోక సత్యలోక వైకుంఠములు, ౭. స్కందపదము, ఉమాపదము, శివపదము (శివలోకములు).

నాలుగవ కల్లోలము:—

౧. భరతవర్షము కన్యాద్వీప సామాన్యనదీ దేశాదులు, ౨. కన్యాద్వీప ప్రసిద్ధశైల తీర్థక్షేత్రములు; ౩. యుగకల్పవ్యవస్థ, శకాధిపతిషోడశ మహారాజాదివర్ణనము, ౪. చాతుర్వర్ణ్యధర్మములు, బ్రహ్మచారిధర్మములు,

౫. గృహస్థాశ్రమము, వివిధవివాహములు, వానప్రస్థాశ్రమము, సన్న్యాసాశ్రమము, సన్న్యాసిభేదములు, యజ్ఞసూత్రబ్రహ్మసూత్రములు, ౬. వర్ణాశ్రమ సాధారణ ధర్మములు, అత్యాశ్రమస్వరూపము, పంచాక్షరీ భస్మధారణాదులు, ౭. వివిధపాతకములు, తత్ప్రాయశ్చిత్తములు, ౮. చంద్రవంశరాజులు, వర్ణసంకరము, బసవేశ్వరావతారాదికము, ౯. బసవేశ్వర వృత్తాంతనిరూపణము, ౧౦. కలిధర్మవర్ణనము, ౧ . వివిధోత్పాతములు, ౧౨. విద్యానగరనిర్మాణము, సింహాసనము, అందు సింహాసనము నధిష్ఠించినరాజులు, తత్పరిపాలనకాలము.

అయిదవ కల్లోలము:—

౧. కుటజాద్రివనప్రదేశములనడుమ మల్లదేశము కుటజాద్రివర్ణనము, వయస్తంభన కాలవంచన మృతజీవన పాదుకాగతి అదృశ్యకరణ పరకాయప్రవేశాది నిరూపణము, ౨. మల్లదేశమున కెళదిగ్రామము, అందు కెళది వంశ మూలపురుషుడు బసవప్ప, అతనికొడుకు చౌడప్ప నాయకుడు, చౌడప్పనాయకునకు రామేశ్వరానుగ్రహము, ౩. శుభాశుభస్వప్నములు, తత్ఫలములు, ౪. నిధిచిహ్నములు, అంజనకరణము, చౌడప్పకు నాయకబిరుదరాజ్యప్రాప్తి, సామాన్యరాజనీతి, సదాశివసింహాసనారోహణము, ౫. సదాశివనృపచరితము, మాయోపాయములు, దొడ్డసంకణ్ణకు రాజ్యప్రాప్తి, ౬. రాజగుణములు, కరాదానము, దుర్గలక్షణములు, బలములు, ౭. శక్తిత్రయము, దొడ్డసంకణ్ణనాయకచరిత్ర, దొడ్డసంకణ్ణరామేశ్వరప్రయాణము, ౮. శకునములు, వానిఫలములు, ౯. సంకణ్ణతీర్థయాత్రాక్రమము, ఢిల్లీలో అంకుశఖానునితో ఖడ్గరణము, ఖడ్గములు చేయు విధానము, తత్ప్రమాణదోషలోహములు, మానూరిదేశమందలి పటపల్లియందు వీరభద్రవిగ్రహప్రాప్తి, తత్ప్రతిష్ఠ, ౧౦. దేవప్రతిష్ఠాకాలగృహనిర్మాణాది నిరూపణము, చిక్కసంకణ్ణపట్టాభిషేకము, ౧౧. పట్టాభిషేకవిధి, సంధివిగ్రహయానములు, ౧౨. ఆసనద్వైధీభావసమాశ్రయములు, సామాది చతురుపాయములు, ౧౩. స్వరముహూర్తఘటికావర్గ యోగినీ బలములు, ౧౪. యుద్ధయాత్రావిధానము, వ్యూహరచనాక్రమము, ౧౫. చిక్కసంకణ్ణపాలనావిధానము, రాజ్యసప్తాంగ సచివసేనానీ పురోహిత వైద్య గణకమాచ సభాస్తారాంగరక్షక భిషగ్దూతాదిలక్షణములు, వెంకటప్పనాయకుని సింహాసనారోహణము.

ఆరవకల్లోలము:—

౧. వెంకటప్పనాయకుడు ఇక్కేరియందు పురభవననాటకశాలలను, సంగళగ్రామమున నొకతటాకమును కట్టుట, పురభవననిర్మాణవిధానము, ౨. నాటకశాలానిర్మాణక్రమము, వర్ణసంయోజన చిత్రలేఖన ప్రతిమాలక్షణములు, ౩. నాట్యక్రమము, ౪. శిరోభేదదృష్టిభేదాదికము, ౫. వివిధహస్తాభినయములు, ౬. వక్షఃప్రభృత్యంగాభినయములు, స్థానకచారీమండలభేదములు, ౭. నాదశ్రుతిస్వరమూర్ఛనాతానవర్ణకాలంకారగమక నిరూపణము, ౮. జాతిరాగరాగాంగ భాషాభాషాంగ విభాషాంతరభాషికోపాంగ క్రియాంగ నిరూపణము, గాయకలక్షణము, ౯. తాలప్రస్తారాది వివిధవాద్యాదిస్వరూపము, ౧౦. ఉపవననిర్మాణము, జలభూమిపరీక్ష, ౧౧. తరుచికిత్సాపోషణ విచిత్రీకరణదోహదవర్ణన, ౧౨. కామశాస్త్రము—జాతి, స్వభావ, గుణ, దేశ, ధర్మ, చేష్టాది వర్ణనము, ౧౩. బాహ్యరతములు, కరణభేదములు, యౌవనస్థిరీకరణము మొదలయినవి, వేంకటప్పనాయక చారిత్రవర్ణనము, ౧౪. రాజోపభోగములు, గృహస్నానపాదుకాలేపనోపభోగములు, ౧౫. వివిధాంగరాగములు, (గంధయుక్తి), ౧౬. వస్త్రమాల్యభూషణోపభోగములు, ౧౭. రత్నాదిస్వరూపము, ౧౮,౧౯. పాకశాస్త్రము, ౨౦. భోజనక్రమము, తాంబూలభోగము, శయ్యాక్రమము, ౨౧. వైద్యశాస్త్రము—ఆదావనిదాన చికిత్స, ౨౨. ద్రవ్యగుణమహారసాదికము, ౨౩. రసోత్పత్త్యాదికము, ౨౪. రససంస్కారాది నిరూపణము, ౨౫. రసశాలాయంత్రాది నిరూపణము, ౨౬. విషనిరూపణము, సర్పాది మూత్రాంతవర్ణనము ౨౭. విషచికిత్స—మంత్రచికిత్స, ద్రవ్యవైద్యము, వీరభద్రనాయక చరిత్రము, శివప్పనాయకుని సింహాసనాధిష్ఠానము.

ఏడవ కల్లోలము:—

౧. సింహాసనలక్షణము, సభామందిరము, అందు సభ్యులు మెలగవలసిన విధము, అధికారులు, అంతఃపుర

స్త్రీలు, ౨. ఇంద్రజాల విద్యాప్రదర్శనము, ౩. కావ్య లక్షణము, కవిగుణములు, సత్తువికకవులు, స్థాయ్యాదిభావములు, రసములు, ౪. నాయకనాయికాలక్షణములు, రీతి గుణవృత్తిపాకములు, కావ్యదోషములు, ౫. అలంకారములు, ౬. నాటకేతిహాసస్వరూపము, శివప్పనాయకునకు పుత్రజననము, ౭. పుంసవనాది వివాహాంతక్రియలు, ౮. హోరాశాస్త్రము, ౯, ౧౦. స్త్రీ సాముద్రిక పురుష సాముద్రికములు, ౧౧. గజలక్షణము, ౧౨. అశ్వశాస్త్రము, అశోత్పత్త్యాది చేష్టానిరూపణము, ౧౩. వివిధదేశజాశ్వలక్షణ రథగోలక్షణ చిత్రకిత్సావర్ణనము, ౧౪. శివప్పనాయకుడు బేలూరుకోట నాక్రమించుట, కోటాచక్రవిధానము, వెంకటప్పనాయకునకు యోగ విద్యోపదేశము, ౧౫. యోగరహస్యములు.

ఎనిమిదవ కల్లోలము:—

౧. వెంకటప్పనాయకుని పరిపాలన, భద్రప్పనాయకుని పట్టాభిషేకము, వ్యవహారపదములు, ౨. భద్రప్పనాయకుని పరిపాలన, సోమశేఖరునకు ధనుర్విద్యోపదేశము, ధనుశ్చక్రగదాకుంతలక్షణ తత్సాధన క్రమము, ౩. మల్లయుద్ధము, ౪. కుక్కుటలావక యుద్ధభాగ శునకలక్షణము, ౫. సోమశేఖరునిపరిపాలన, సోమశేఖర చెన్నమాంబా వివాహము, చెన్నమాంబకు సోమశేఖరుని యుపదేశము, విభూతిచేయు విధానము, ౬. రుద్రాక్షధారణ జపవిధివర్ణనము, ౭. శివపూజ, దాని మహిమ, ౮. చెన్నమాంబా రాజ్యపాలనము, మహేశ్వరమహిమ తద్దానఫలాతిశయవర్ణనము.

తొమ్మిదవ కల్లోలము:—

౧. పిండాండక్రమము, ౨. సంసారనిరసనము, ౩. శైవతత్త్వప్రతిపాదనము, ౪. శాస్త్రవిభాగవిమానాం సావైశేషికన్యాయమత నిరూపణము, సాంఖ్యయోగ వేదాంతమతనిరూపణము, ౬. అవైదిక — జైన బౌద్ధ చార్వాక-మతములు, తత్తన్మత ప్రాప్యస్థానవర్ణనము, ౭. దీక్షాభేదగురుశిష్యబుత్విక్కాలదేశాది నిరూపణము, ౮. దీక్షావిధానమంటపలక్షణ లింగపూజావిధానాదికము, ౯. షట్స్థలజ్ఞాన నిరూపణము.

అమూల్యము, పరమోపకారకమునయిన యీ విజ్ఞానసర్వస్వమును మనకందజేసిన సంపాదకులు ప్రశంసాపాత్రులు. ఇట్టిగ్రంథములవాఙ్మయాభ్యుదయమునకు నిదర్శనములు. దేశీయాన్యదేశీయ భాషలందువలెనే సంస్కృతమునను ఇట్టి విజ్ఞానసర్వస్వములు వెలసి ప్రచారమును గాంచవలసియున్నవి. అందులకు పండితుల చేయూత పరమావశ్యకము.

పాఠకసౌలభ్యమునకై దీనివెలను మార్చి నెలకడపటివరకును తగ్గించినారు. అసలువెల ఇరువదిరూపాయలు. తగ్గించినవెల - లోలుబైండుది పదకొండురూపాయలు, క్యాలికోబైండుది పదిరూపాయలు. ఇట్టి యమూల్యావకాశమును గోలుపోక వాఙ్మయాభిమానులెల్లరు దీనిని కొని యిందలి యర్థములను చూరగొందురుగాక! గ్రంథాలయములును ఇట్టియవకాశమును గోలుపోఁజనదు.

పుస్తకములను వలయువారు మొత్తము వెలను గాని, ఒకరూపాయి అడ్వాన్సుగాని పంపి గ్రంథములను బడయవచ్చును. మొత్తము వెలను ముందుగ పంపినచో పుస్తకములు రిజిష్టరుద్వారా పంపబడును. కొలది ప్రతులుమాత్రమే మిగిలియున్నవి.

ప్రాప్తిస్థానము—బి. యస్. నాథ్ అండు కో., భాస్కరవిలాస్, వేపేరి, మదరాసు.

'ఆచార్య.'

---

## ఉత్తర రామచరితము

అనువాదకులు:—జయంతిరామయ్య పంతులు గారు, బి ఏ., బి. యల్., ముక్తీశ్వరము; తొత్తరమూడి పోస్టు, తూర్పుగోదావరి.

ఉత్తరరామచరిత మిప్పటికి పలువురచే అనువదింపబడినది. దీనియందు తమకుగల యభిరుచి కారణముగా జయంతి రామయ్యపంతులుగారు మరల దీనిని తెలిగించిరి. పంతులుగారు తెలుగునాటికి క్రొత్త వారుకారు. అనువాదమునను వీరు 'మాటకు మాట తెలుగు' పద్ధతిని గాక స్వేచ్ఛానువాదము కావించినట్లు వీరి యుపోద్ఘాతమువలన తెలియుచున్నది. 'మూలములోని భావములకును, రసములకును భంగము కలుగకుండ నాంధ్ర

భాషా సంప్రదాయముల పాటింప వలయునని వీరి యత్నము. ఈయత్నము కడుంగడు మంచిది. ఒక్కొక్క భాషకును వేర్వేరు సంప్రదాయములు గదా! అట్టిచో మాటకుమాట పెట్టి కూర్చినయనువాదమువలన నేమిలాభము? వినవెగటుగ నుండును గాని? మూలమును దాటరాదు, మూలమందలి భావములను, రసములను అనువాదమున జొప్పింపవలయును,-అనుటయే వీరి పరమార్థము. ఇట్టి పరమార్థమే కొనసాగియుండినచో యనువాదము సహృదయరంజకమగు ననుటకు సందేహముండబోదు. రామయ్య పంతులుగారి యత్నములోనే యనువాదము సాగించుచువచ్చినను యటనట మూలాతిక్రమణములును, మూలభావ విపర్యాసములును దొరలినవని చెప్పుటకు విచారమగుచున్నది. అందు కొన్నిటిని జూడదగును.—

ప్రస్తావనయందు,—

సూత్ర—తనకుదోచినభంగిని దగున బలుక,
నిందలేదన్న మాట తానెందుగలదు.
వనితలకొమడలను గవులవాక్కులందు
దప్పులే లోకమెప్పుడు దలచుచుండు.

నటుడు—ఈవిషయములో జనులతిదుర్జనులని యే చెప్పదగును. (పుట 3)

ఇందు సూత్రధారుని వాక్యమున లోక దౌర్జన్య ప్రసక్తియే లేక నటుని వాక్యమున నా దౌర్జన్యమున కతిశయము చెప్పబడినది. మూలమున నట్లుగాదు; సూత్రధారుడు జనులు దుర్జనులన నటుడు అతిదుర్జనులనెను.

రాము—ఈమె చెప్పినదెల్ల జేయుచు నేయున్నాడను. (పుట ౬)

ఇది మూలమునకు సరిపడదు. సీత తనకుగల కోర్కెలను దెలుపుచో తప్పక సంపాదింతునని వసిష్ఠునిసందేశమునకు రాముని ప్రతివచన మిది.

'యోగమువలన మేమిటనాగినాము.........'

(పుట ౭)

జామాతృయజ్ఞమని మూలము. 'ఋశ్యశృంగేతి వక్తవ్యే జామాత్రిత్యుక్తిః పూజ్యతాస్ఫోరణాయ. ఏవం చ తదింగితం జ్ఞాత్వావాప్యాభిస్తత్రాపి తత్త్వం, కింపున స్తోత్రవ్యనిర్బంధేనతి?' అని వీరరాఘవవ్యాఖ్య. ఇంత యభిప్రాయము గల జామాతృపదమును వదల జేసినది.

సీత—ఇదిగో ఎక్కినదానను. గర్భము దరుచున్నది. మెల్లగాబోనిమ్ము. (పుట ౨౭)

'రథము సిద్ధముగానున్న' దన్న లక్ష్మణసందేశమును దుర్ముఖుడు విన్నవింపగా దాని కిది ప్రత్యుత్తరము. రథమును దుర్ముఖుడు గొనితేలేదు. అట్టితరి యీ వాక్యమున కన్వయ మెట్లు? మూలము—'ఇయమాగతాస్మి (ఉత్థాయ పరిక్రమ్య) స్ఫురతి మే గర్భభారః, శనైః శనైర్గచ్ఛావః' అని. దుర్ముఖుడే రథము గొనితెచ్చియుండి, సీత దానినెక్కి మెల్లగ బోనిమ్మని చెప్పియుండిన, తరువాత 'ఇతో దేవి' అని దుర్ముఖుడు దారిజూపుటయెందుకు?

మురల—సఖి తమస! పూజ్యశ్రీ నగస్త్యుని భార్య లోపాముద్ర సరిత్స్వరయాన గోదావరిని బిలిచికొని రమ్మని నన్ను బంపినది. (పుట ౪౩)

గోదావరిని పిలుచుకొని రమ్మనలేదు. సంగతి చెప్పి రమ్మన్నది. 'భగవతి, తమసే! ప్రేషితాస్మి భగవతో గస్త్యస్య పత్న్యా లోపాముద్రయా సరిద్వరాం గోదావరీ మభిధాతుం, జానాస్యేవ యథా......' అని మూలము.

వాసంతిక—దేవ! సత్వరముగ జటాయుశిఖరమునకు దక్షిణమునున్న సీతాతీర్థమునొద్ద గోదావరి దాటి దేవిపుత్రకుని రక్షింతురుగాక! (పుట ౫౮)

గోదావరిని దాటుటయెందుకు? 'గోదావరీ మవతీర్య' అని మూలము. అవతరణము దాటుటకాదు, దిగుట. గోదావరిలోనేకదా ఏమనుకున్న జలకమాడుచుండినది?

కౌసల్య—కంచుకి పిలిచినమీదట నతడు వచ్చునో రాడో మీరేమని తలతురు? (పుట ౯౫)

మూలము—కిం మన్యధ్వే ఏవంభణిత ఆగమిష్యతీతి.

'చెప్పినవెంటనే యతడు వచ్చునని గాదు నీ తలంపు' అని దీని యర్థము. దీనికి సమర్థకముగనే జగద్ధరుడు 'భిద్యతే చాసవ్యావృత్తిః పుంస్యేతస్య విరామ్యాణ్యక్షే' (అట్టి విరామములకు మంచినమ్మకము తప్పునా) అని యన్నాడు

ఒక పురుషుడు—అతడు రాకుండగనే మిక్కిలి శ్రీఘ్రముగా బోయి చెట్లచాటున దాగికొనెను. (పుట ౧౦౫)

'తత్త్వరితతర మనేన తరుగహనే నాపసర్పిత' అను మూలమునకు 'శీఘ్రముగా బోయి చెట్లచాటున దాగికొనెను' అను తెలుగు. మూలములో చెట్లగుబురుదూరిన పారిపోయినాడనుగాని దాగికొనె ననలేదు.

ఇట్టి ప్రమాదము లింకను కలవు. అనువాదకులం దెందరు ఎత్తినఎత్తుతోనే అనువాదమును సాగించిరేయుండిన రెండుల బాగుగ నుండెడిది. కాని సమమనకును నిట్టి ప్రమాదములు వైరస్యాపాదకము లగును.

ఉత్తర రామచరితరసవిషయమున రెండుమతములు—కొందరు విప్రలంభ మని, మరికొందరు కరుణ మని. ఈ విషయమై వాదోపవాదములు ఇప్పటికిని గలవు. కాని యిదమిత్థమని తేలినదిలేదు. రామునకు ప్రత్యాశ లేదని కరుణవాదుల మతము. రామయ్యపంతులు గారును తన్మతమువారే. రామునకు సీతాశీలితనిశ్చయము, ప్రత్యాశ లేదనియే వీరు తలంచిరి. దానినే తమ యుపోద్ఘాతమున సాధింప బ్రమాణములు చూపిరి. ప్రమాణవాక్యముల తెలిగించుటలో సూడ నొంకు రెండెడల పొరపడిరి. ('శోకస్యపరిపోషః కరుణః, ఆశావిచ్ఛేదశతి సర్వేంద్రియాక్ల మోవా' అనురసతరంగిణీ వాక్యమునకు 'శోకముయొక్క పరిపోషణము కరుణమనుసు. ఆశావిచ్ఛేదమైనచో సర్వేంద్రియములు క్లాంతములగును' అనిరి. శోకముయొక్క పరిపోషణముగాని, ఆశావిచ్ఛేదమునెడ గలుగు సర్వేంద్రియగ్లానిగాని కరుణము అని మూలమున కర్థము. ఇట్టి పొరపాటే మరియొకచోటను కలదు.) ప్రత్యాశయే లేదని వీరి నిశ్చయమైనచో సీతాపరిత్యాగమందలి 'హా భగవతి వసుంధరే! శ్లాఘ్యాం దుహితర మవేక్షస్వజానకీం' అను రామునివాక్యమున కేమి చెప్పుదురో! ఈరామప్రార్థననేకదా తాను నెరవేర్చినట్లు వసుంధర గర్భాంకమున జెప్పినది.—"పిల్లను విడిచిపెట్టు సమయమున 'భగవతి, వసుంధర! శ్లాఘ్యయగు నీ కూతురు జానకిని గనిపట్టు' మని నీ వంటివి. ఆప్రకారము చేసిన దాన నయితిని గదా" యని. ఇది ప్రత్యాశావిషయము కాదా! 'యస్యభార్యా విమారస్థా పతితాధూమితాపివా, అనిష్ఠః ప్రతిహాలవా తస్య ప్రతిక్రియా క్రియా' శ్లోకములో 'విమారస్థా' యనుపద్యములో తప్ప సీత మరిపద్యములో జేరుట కవకాశము లేదనియు, ఇట్టితరి యీ కవు సీతాశీలితనిశ్చయప్రమాణ మెట్లగుననియు విప్రలంభవాదుల కొకప్రశ్న వైచిరి అనువాదకులు. సీత విమారస్థ కాదనియు, రసాతలమందున్నను విమారస్థయే యైనచో మృతినొందినదానిని గూడ విమారస్థగా నేల యెంచరాదనియు ననిరి. సశరీరలోకాంతరగమనమునకును శరీరనాశముతోడి మరణమునకును భేదము లేదా? ఇంత కును ఇంకను ఆ కూపట్టులను సూక్ష్మేక్షికతో జూచిన రామునకు ప్రత్యాశ లేదనక తప్పదు

ఎట్లున్న నేమి? రామయ్యపంతులుగారి యనువాదపద్ధతి మెచ్చదగినది. దీని నెట్టి సూక్ష్మముతో ననువదింపబూనిరో అట్టి సూక్ష్మముతోనే మరికొన్ని నాటకములను తెలిగింపవలయును. సంస్కృతవాఙ్మయము పారము. ఒకరు చేకొన్న దానినే మరలమరల నితరులనువదించుటలో లాభమేమి? తక్కినవిగూడ ఆంధ్రలోకమున కబ్బవలదా?

ఈ పుస్తకమువెల ఒకరూపాయి. వలయువారు గ్రంథకర్తకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

తి. వెం. రం.

---

దేశభక్తుడు కందన్ (ఆంగ్లనవల)

**Kandan, The Patriot**

గ్రంథకర్త: కె. యస్. వెంకటరమణిగారు, బి. ఏ., బి. యల్.

క్రౌను సైజు, ౨౬౦ పుటలు, మేలుకాగితము, అందమయిన సంపుటము, వెల రు. ౨.

ఆంగ్లమున స్వతంత్రరచనలకు దొరకొనిన భారతీయులలో వెంకటరమణిగారొకరు. వీరి మృదుమంజుల భావప్రదర్శనమును, శైలిసౌలభ్యమును పలువుర ప్రశంసల నందినవి. వీరి వ్యాసములందును, నవలలందును భారతీయ సంప్రదాయములును, జాతీయజీవనమును ప్రతిబింబితమైనందున, విదేశీయులైన పాఠకులకు ముఖ్యముగా నాకర్షకము లగుటలో నాశ్చర్యము లేదు.

"దేశభక్తుడు కందన్" అను నీనవలలో గ్రంథకర్త ప్రకృతభారత పరివర్తనమును ప్రదర్శింప నుద్యమించెను. దేశాభిమానమును, అహింసా సిద్ధాంతమును ఇందలి పాత్రలకు పునాదియగుచున్నవి. అరవదేశములో పుట్టి, దక్షిణాఫ్రికాలో పెరిగి, ఆంగ్ల దేశమున విద్య నభ్యసించి, ఐ. సి. యస్. పరీక్షలో కృతార్థుడై, ఉద్యోగాభిలాషను త్యజించి, దేశారాధకుడై, స్వదేశమునకు వచ్చి జానపదులను మద్యమునుండి వారించుచు, వారియింటిదైవతమువలె చరించి, దేశసేవకొరకు జీవితము నర్పించినవాఁడు కందన్. ఇతని హృదయపరివర్తనమునకు కారణముగా స్త్రీవిషయమునగైన మనోరథ వైఫల్యమును గ్రంథకర్త నిర్దేశించినాడు. కథలో మాత్రము కందన్ కన్న అతని భావములే ప్రాముఖ్యము వహించినవి. కొన్ని సిద్ధాంతములంగలిపి యీపాత్రను సృష్టించిరాయనునట్లు దోచును. ఇందులకు కారణము శాంతరసమున కీపాత్రము లక్ష్యమగుటయే కావచ్చును. ఇతరపాత్రలు రంగన్, రాజేశ్వరి, సరస్వతి, పొన్నన్, చొక్కలింగ మొదలి యూరున్న సువారలు సందర్భములకు సరిపోవువారే. ఐనను, సామాన్యపాత్రలం దస్వాదాత్తత నారోపించు యత్నములు విస్పష్టముగా నున్నది. ముఖ్యముగా సరస్వతి కెక్కడ లేని ఔన్నత్యమును సంపాదించుటకు గ్రంథకర్తగారు కేవలము మాటలపై నాధారపడి రనవలసివచ్చుచున్నది. పాత్రములందు గాంభీర్యము కొఱతపడియున్న దనుట వెంకటరమణిగారి రచన లోపమే గావచ్చును. కాని వారు ప్రదర్శించు లక్షణములుమాత్రము చిత్తాకర్షకములుగా నుండుట మెఱుఁగదా.

వెంకటరమణిగారి శైలినిగూర్చి తెలుగున ప్రశంసింపబూనుట యుచితము గాదు. ఐనను వారి ప్రశస్తికిదియే ముఖ్యకారణమని చెప్పకప్పదు. అలతియలతి తునియలతో కాహళ సంధించుట వీరికి సహజమైనది. ఉపమలొక్కొక్కెడ తెచ్చి కోలుగా నున్నను, సామాన్యముగా నతిమంజులములై యుండును. తరుశాఖలనుండి పూవులు రాలునట్లుండును వీరివాక్యములు. ఏకధారగా ప్రవహింపదు-వీరిశబ్దవాహిని. అందువలననే వీరిశైలి వ్యాసములందును, కథానకములందును ప్రశస్తి గాంచునట్లు ఇతర రచనలందు గాంచదు.

గు. వెం. సు.

---

## ప్రేమసుందరి

(ప్రథమ భాగము)

క్రౌనుసైజు, ౧౧౩ పుటలు, వెల తెలియదు.

కృష్ణదేవరాయగ్రంథమాలలో తృతీయపుష్పము. గ్రంథకర్త: హనుమనసత్తి దేవదాసముగారు. వలయువారు కల్లూరు అహోబలరావుగారు, మేనేజరు, భారతీభవనము, కౌలుబజారు, బళ్లారి అని వ్రాయవలెను.

ఈ గ్రంథమునకు "క్యాస్టు ఆఫ్ ది హోలీ గ్రెయిలు" అను గ్రంథము మూలమని తోచుచున్నది.

"ప్రేమసుందరి మరణాంతికనాయిక. ఈనిర్మల ప్రేమహృదయ మొట్టమొదట తానొకపురుషుని ప్రేమించెనో యాపురుషునే పరిణయమాడగోరి కారణాంతరములచే నతఁడు దన్ను పరిణయమాడకయుండిన నతనిపై దనకుగల ప్రేమను మరలింపనలవికొనజాలక దశవిధమదనావస్థలకు లోనై తుదకు సంతాపజ్వరముచే మరణించిన కన్య" యని గ్రంథకర్త తెలియజేసెను.

ప్రథమభాగమున కథ పూర్తికాలేదు. రెండవ భాగమున ప్రేమసుందరి యస్తమయమును గాంచగలము.

ప్రథమభాగమున ప్రేమసుందరి ప్రేమించిన వ్యక్తి ప్రేమసుందరియెడల సోదరీభావమునే జూపుచుండెను.

శైలి కటువు. పదప్రయోగసౌష్ఠవము కొరవడినవి. మారుమూలపదములు మెండు. పాఠకులు శబ్దరత్నాకరమును, లక్ష్మీనారాయణీయమును దగ్గర నుంచుకొనవలసియుండును.

మరియు ఆంధ్రమునగాని, సంస్కృతమునగాని గానలు దొరకవో యన్నటుల గ్రంథకర్త ఏనాటివాడో అను టెన్నిసన్ కవిపుంగవుని గీతముల నేల యనుకరింపవలసివచ్చెనో తెలియకున్నది.

ఆంధ్రవాఙ్మయమున విషాదాంతములగు కావ్యములు, నవలలు, రూపకములు విరివిగాలేని కొఱతను

తీర్చుటకు గ్రంథకర్త శేన్నిషనునుండి కైకొని ఈనవలను విషాదాంతముగ రచించెను. కష్టములను మానవులు మరవకుండ చేయుటకును, నితరులకు ఆదర్శప్రాయముగ నుండుటకును వ్రాసితినని గ్రంథకర్త వ్రాసెను. గ్రంథకర్త యభిప్రాయములో ఏకీభవించజాలనందులకు చింతిల్లుచున్నాడను. విషాదాంతకావ్యములు మున్నగునవి భారతసంప్రదాయమునకు విరుద్ధము. హిందువుల కది యమంగళము.

జరుగుమిల్లి సాంబశివరావు, బి. ఏ.,

---

## కావ్యకథావళి

ప్రకాశకులు: ఆర్యపుస్తకాలయమువారు, రాజమహేంద్రవరము. క్రౌనుసైజు, ౯౮ పుటలు.

ఘనగిరి రామకవి ప్రణీతమగు 'యథావాల్మీకము', శేషము రఘునాథాచార్యకృతమగు 'కులశేఖర మహీపాలచరిత్రము,' సుబ్బరాయకవి ప్రణీతమగు 'జయ విజయాభ్యుదయము,' మంచన కవికృతమగు 'కేయూరబాహుచరిత్రము,' మారనకవికృతమగు 'మార్కండేయపురాణము,' అనంతయ్య రచించిన 'విష్ణుమాయానాటకము' అను ఈ ఆఱు ప్రాచీనకావ్యముల నుండియు ఒక్కొకకథ పట్టుగా ఈపుస్తకమున కూర్పబడ్డవి. ఇందు కొన్ని వెల్లడికాని సత్కావ్యములు. అసమగ్రములైనను, దొరకినమట్టునకు ఆకావ్యములను ప్రకటించుటకును పుస్తకాలయమువారు పూనుకొనెల్లను.

---

## భారతకథాలహరి

రచయిత: ద్రోణంరాజు సీతారామరావుగారు. ప్రకాశకులు: ఆర్యపుస్తకాలయమువారు, రాజమహేంద్రవరము. క్రౌనుసైజు: ౧౪౯ పుటలు. భారతకథ సరళమగు గద్యశైలిని రచితమైంది.

---

## సావిత్రీదేవి

ప్రకాశకులు: నాళం అప్పలనరసింహముగారు, రాజమహేంద్రవరము. క్రౌనుసైజు, ౮౩ పుటలు. వెల ౧౨ అ. సావిత్రిచరిత్రము. సరళశైలి. బాలబాలికలకు ఇంపుగ నుపయోగపడును. టెక్స్టుబుక్కు కమిటీవారు దీనిని సిఫార్సు చేసిరి.

## భగ్నప్రేమ

రచయిత: నరహరిసెట్టి శేషగిరిరావు గారు, తూర్పువీథి, ఏలూరు. పదొకొండు ధారాళములగు పద్యములు.

---

## షర్బత్ పాకశాస్త్రము

గ్రంథకర్త: తాడి బ్రహ్మానందరావువర్మ గారు, కోరంగి, తూ. గోదావరి. క్రౌను ౧౬ సైజు: ౪౦ పుటలు. వెల: ౪ అ. ఇందు పలురకముల షర్బత్తులు, కొన్ని మురబ్బాలు, పన్నీరు మున్నగు వస్తువులు తయారు చేయువిధములు తెలుపబడ్డవి.

---

## నీతి కథారత్నావళి

రచయిత: దాసరి లక్ష్మణస్వామి గారు, పిఠాపురము, తూర్పుగోదావరి. క్రౌనుసైజు: ౬౦ పుటలు, వెల ౬ అ.

ఇందు మంచనకవి 'కేయూరబాహుచరిత్రము' నుండి పదునాలుకథలు సంగ్రహముగ, సులభశైలిని రచింపబడ్డవి. బాలవిద్యార్థుల కిది చదువదగి యున్నది.

---

# గ్రంథస్వీకారము

## ఆంధ్రకవిత్వచరిత్రము

బసవరాజు వేంకట అప్పారావు (బి. ఏ., బి. యల్.) గారిచే విరచితము. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, ౨౯౨, ఎస్ప్లనేడ్, చెన్నపురి. క్రౌనుసైజు, ౩౦౮ పుటలు. వెల రు. ౧-౭-౦.

---

## శ్రీ భూలోకశక్తి

దండకము. కర్త: రాచిరాజు కృష్ణమూర్తికవి గారు, అలకనారాయణపురం, గొల్లపాలెంపోస్టు, (Via) చీపురుపల్లి, విశాఖపట్నంజిల్లా. క్రౌనుసైజు: ౧౩ పుటలు, వెల ౨ అ. ౬ పై.

---

భా. క.—భారతియందు ప్రకటితములయిన విమర్శనలకు ప్రతివిమర్శనలు ప్రకటింపబడవు.—భా. సం.




## అమూల్యాంధ్ర గ్రంథదురవస్థ

శ్రీయుతులు, కళాప్రపూర్ణ, మహోపాధ్యాయ బిరుదాంచితులు నగు వేదము వేంకటరాయశాస్త్రులుగారు రచియించిన పెక్కుగ్రంథములవలన నాంధ్రసారస్వతము గాంచిన మహాభ్యుదయ మాంధ్రు లేనాడును మరువరానిది. వారిగ్రంథము లాంధ్రసారస్వతముతో పాటు చిరంజీవులయి వెలయునవి. అచిరకాలముననే శ్రీ శాస్త్రులుగారి శిష్యవర్గము సాహాయ్యమున 'నాంధ్రహితోపదేశ చంపువు', 'సాహిత్యదర్పణము'నను రెండు గ్రంథములు వెలువడనున్నవి. సాహిత్యదర్పణ మాంధ్రమున ననిదంపూర్వము. శాస్త్రులుగారి గ్రంథముల నధ్యయనముగావించి వానియందలి యమూల్యవిజ్ఞానమువలన నతురాస్యులగు నాంధ్రులెల్లరు సాహిత్యాభివృద్ధిని గావించికొనవలసినవారు. వీనిలో పెక్కులిపుడు లభింపకున్నను పునర్ముద్రణభాగ్యమును బడయజాలకున్నవి.

ఇట్టి యుత్కృష్టగ్రంథసంచయమున మిగిలియున్నవిసయితము కొనువారు లేక కట్టలలో నలిగి చివికిపోవుచున్నవనియు, అవి సగము వెలకు విక్రయింపబడుననియు నిటీవల కొండొక్కచో కనిన కరపత్రమువలన తెలిసి మిక్కిలి విచారింపనయ్యెను. దీనినిబట్టి ఆంధ్రలోకమునగల పండితాభిమానము, సారస్వతజిజ్ఞాస తేటతెల్లమగుచున్నది.

నేటికాలమున ప్రపంచమునందలి వివిధ సారస్వతములు సర్వతోముఖాభివృద్ధిని గాంచుచున్నవి. అసంఖ్యాకములుగ గ్రంథములు వెలువడుచున్నవి. ఒక్కొక్కటియు పెక్కుముద్రణములను గాంచుచున్నది. ఒక్కొక్క ముద్రణమునను వేలకొలది ప్రతులు ముద్రితములయి యమ్ముడు వోవుచున్నవి—అధమశ్రేణికి జెందిన గ్రంథమయినను సరియే. ఇట్టిది పేరుకొనదగిన సారస్వతవికాసము. ఆంధ్రసారస్వతమున విజ్ఞానమునకు దోహదము గలిగించు నుత్కృష్టగ్రంథములగతి యిట్టులున్నది. సారస్వతము పట్టున నీయనాదరము, ఆంధ్రులకు, ఆంధ్రదేశమునకు, ఆంధ్రసారస్వతమునకు గొప్ప కళంకము. ఇపుడయినను, స్వయము విలిచి, ఒరులు విలుచునట్లు ప్రోత్సహించి, యీగ్రంథము లాంధ్రదేశమున నిండు కొనజేసి తమకు లభించిన యమూల్యవిజ్ఞానమును ఆంధ్రులు కాపాడుకొనదగుదురు.

మరియు నాంధ్రదేశమున గల గ్రంథాలయము లన్నియును నీ గ్రంథసంచయమును సేకరించు కొనవలెను. దీనివలన ఉన్నవి చెల్లుటతోపాటు వీనికిని, ఇపుడు లభింపనివానికిని పునర్ముద్రణ ప్రాప్తిగలిగి నిరంతరము నీయమూల్యగ్రంథము లాంధ్రలోకమునకు లభించుచుండగలవు.

* * * *

## కీ॥ శే॥ బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బారాయశాస్త్రులు గారు

“గడచిన పుష్యబహుళ ఏకాదశి (౨-౨-౩౨) మంగళవారము పగలు ౧౧ గంటలకు కోనసీమ యందలి సుప్రసిద్ధపండితులు బ్ర॥ శ్రీ కొంపెల్ల సుబ్బారాయశాస్త్రులుగారు స్వగ్రామమగు మోడేకుఱ్ఱునందు దివంగతులైరి. వీరు సాహిత్యమునను జ్యోతిషశాస్త్రమందును గొప్పపండితులు. సారస్వత సర్వస్వము, ఆంధ్రపత్రిక, భారతి మున్నగు పత్రికలద్వారా ఆంధ్రదేశము వారి నెఱిగియే యున్నది. వీరు పండితులే కాక ఉభయ భాషలయందును కవులు. అలంకారశాస్త్రమును వీరు బాగుగ తరిచినవారు. ఒకటి రెండు అలంకార గ్రంథములను సంస్కృతమునుండి తెలుగుచేసిరి. వీరు స్వయంకృషివలననే గొప్పపాండిత్యము గడించిరి. ధర్మశాస్త్ర విషయములందు దిగంబరస్వామి మున్నగు సుప్రసిద్ధ సన్యాసులుసహా వీరితో సంప్రతించెడివారు.

జ్యోతిషవిషయమున, కేవలము ఫలితజ్యోతిషమున అనుభవము సంపాదించుటకాక శాస్త్రమున వీరు గొప్ప ప్రామాణికులు. ఆంధ్రదేశమునందే కాక, తిరువాడి మున్నగు అన్యప్రాంతనగరముల సహా గొప్ప గొప్ప పరిషత్తులందు, వీరువాదించి తమపక్షమును నెగ్గించుకొని, ఎల్లరచే గౌరవ సత్కారముల నందివచ్చిరి. తుది వత్సరములలో వీరికి గ్రహవేధలు పునఃపరీక్ష సలిపి నిర్ణయము కావింపవలె నను సంకల్ప ముండెడిది. అందులకుగాను కొందరు ధనికులు సాయముచేయ సిద్ధపడిరి. కాని దైవవశమున నది కొనసాగదయ్యెను. పూర్వము పెద్దాపుర సంస్థానమునకు కల్గిన ఉపద్రవమున రాజవంశమును నిలువబెట్టిన యశశ్శరీరిణి కొంపెల్ల లక్ష్మసోమిదేవమ్మ యాజులుగార్ల వంశములోనివారు వీరు. నాడు సంస్థానమువారొసగిన (విశాఖజిల్లా చీపురుపల్లి ప్రాంతమునగల) లక్ష్మీపురాగ్రహారము నేటికిని వీరి భుక్తమున గలదు. వీరు స్వయముగ విజయనగరము, వెంకటగిరి మొదలగు సంస్థానములందు సత్కారములు పొందినవారు. సంపన్న గృహస్థులు. తమ్మాశ్రయించిన విద్యార్థులకు ఇంట భోజనము పెట్టి విద్యాదాన మొసగెడివారు. దాదాపు డెబ్బది సంవత్సరములు జీవించి పరమపదించిరి.”

సాహిత్యమునను, అలంకారశాస్త్రమునను, జ్యోతిషశాస్త్రమునను, ధర్మశాస్త్రమునను ఆంధ్రలోకమున మిగుల ప్రఖ్యాతిగన్న బ్రహ్మశ్రీ కొంపెల్ల సుబ్బారాయశాస్త్రులుగారి విశిష్టవిజ్ఞాన సంపదను భారతి యాంధ్రులకు పంచిపెట్టుచుండినది. వీరి యుపజ్ఞకు, విషయపరిశీలనమునకు, విమర్శనచాతుర్యమునకు భారతియందు ప్రకటితములయిన వీరి వ్యాసములు ప్రమాణములు. వీరివ్యాసములను కొన్నిటినిమాత్రమే భారతి ప్రకటించుకొనగలిగినది. ఇపుడు వీరు దివంగతులగుటచే నిక వీరి యమూల్యవ్యాసముల గాంచు భాగ్య మంతరించినదని వ్రాయుటకు కలమాడకున్నది. పాండిత్యము, లోకానుభవము గలిగిన యిట్టి మేధాసంపన్నులు శ్రీ శాస్త్రులుగారు లేని కొఱత యాంధ్రలోకమునకు దీఱునది కాదు.

పెక్కు శాస్త్రములయందు పాండిత్యము నలవరించుకొని, నిరంతర విద్యాగోష్ఠుల సద్దాని సద్వినియోగము కావించుచు ధర్మైకదృక్కులు, ధన్యజీవనులునయి డెబ్బదియేండ్లు మని

దేహయాత్ర చాలించిన శ్రీ శాస్త్రిగారు మోక్షపదమును బడయ పరమేశ్వరు డను గ్రహించుగాక!

* * * *

తెలుగుసంక్షిప్తలేఖనము

తెనాలివాసులు, శ్రీ బి. వి. రంగారావు (F. C. I., Diplomat in commerce and auditor) గారు నూతన తెలుగుసంక్షిప్తలేఖన గ్రంథమును రచియించియున్నారని తెలుపుటకు సంతసమగుచున్నది. ఇది యముద్రితము. 'ఇది పిట్‌మెను మహాశయుని New Era Edition ను కొంతవరకు అనుసరించి రచింపబడినదికాని ప్రాతముద్రణమునకును, దీనికిని చాలభేదము కలదు. ఇందు వేగముగను, సులభముగను మంచిలేఖనశక్తి నలవరుచుకొనుటకు జాలిన సంస్కరణములు మూలసూత్రములు, లిపి, లేఖనవిధానము మొదలగువానియందు కావింపబడినవి. దంత్యతాలవ్యజకారముల కొక్కటియె లిపిసంకేత మిందు గలదు. ఆయాయధ్యాయముల నంటి, వానియందు వివరింపబడిన సూత్రముల ననుసరించి విరివిగ పదవర్ణములు (Grammalogues) చేర్పబడినవి. వెనుకటిగ్రంథమున దాదాపు ౨,౦౦౦ క్రియాపదములకు ప్రత్యేకలిపిచిహ్నములు గలవు. అవి రెండువందల పదునాలుగుపుటలు నిండియున్నవి. 'వండించుకొనడయ్యెను, వండించుకోడయ్యెను, వండించుకొనడాయెను, వండించుకోడాయెను—'అనునిట్టి సమానార్థకపదములనేకములు ప్రత్యేకలిపిచిహ్నములు గలిగియున్నవి. కావున నీపట్టిక యింత పెరిగినది. ఈగ్రంథమున నావశ్యకమయిన పదములుమాత్రమే కలవు. తరచుప్రయోగముగల ప్రత్యేకపదములకు, వాక్యైకదేశములకు క్షిప్తచిహ్నములు విరివిగా గలవు.' పరిశీలనార్థము పంపిన గ్రంథమునందలి కొన్ని యధ్యాయములవలన పైన పేర్కొనిన విషయము సత్యదూరము కాదని విశ్వసింపదగును.

ఆంధ్రులకు దేశాభిమానము, భాషాభిమానము ద్రుతగతిని పెచ్చుపెరుగుచున్నది. ఆంధ్రులు విశ్వవిద్యాలయమును సంపాదించుకొనినారు; ప్రత్యేకరాష్ట్ర సంపాదనమునకయి పాటుపడుచున్నారు; విద్యాబోధనము, నిత్యవ్యవహారములు నాంధ్రమున నే జరుప ప్రయత్నము చేయుచున్నారు. దేశీయుల సర్వతోముఖాభివృద్ధికయి ప్రజాప్రబోధము కావించువారలాంధ్రమున నుపన్యసించుచున్నారు. ఆంగ్లమే శరణ్యముగ నున్నవారు సైతము నాంధ్రమునే యవలంబించుచున్నారు. వాగ్రూపమున నిటు లవతరించు వివిధవిషయములు సరిగా వ్రాత కెక్కుటావశ్యకము. ఇందుకు శీఘ్రలేఖన సామర్థ్య మపేక్షణీయము.

ఆంగ్లమున పిట్‌మెనుపద్ధతియు శీఘ్రలేఖనసిద్ధికొర కిప్పటికి నాలుగైదు సంస్కరణములను గాంచినది. అంతకన్న లేఖనమున వేగము అలవడదగిన యొండురెండు ఇతర విధానములు వ్యాప్తి జెందియున్నవి.

ఆంధ్రమునను శీఘ్రలేఖనసిద్ధికొఱకు సంక్షిప్తలేఖనవిధానమున సంస్కారము కావలయును. అట్లు వలసిన సంస్కారము ప్రకృతగ్రంథము చాలవఱకు పొందియున్నందున నది ప్రచురణయోగ్యము కాగలదు. కాని ప్రచురణకార్యము సులభముకాదు. దానికి ధనము విశేషము కావలయును. తొలియాంధ్రగ్రంథమును ప్రకటించినట్లే ప్రభుత్వమువారు ఉచితరీతిని గ్రంథకర్తను బహూకరించి, యీ గ్రంథమునుకూడ ప్రకటించి ప్రచారమునకు గొనితేదగుదురు. ముద్రితమగుటకు బూర్వము సంక్షిప్తలేఖనమున సమర్థులగు వారలు కొందఱు గ్రంథమును పరిశీలించి ఇంకను ఆవశ్యకములగు సంస్కారములను గావించుట లెస్స.

* * * *

కతిపయ శబ్దార్థశబ్ద స్వరూప విచారము

ఈ పేరున భారతియందు ప్రకటితములయిన వ్యాసములలో నీవ్యాసైక దేశము చిట్టచివరదని భారతిపాఠకులకు తెలుపుటకు మిక్కిలి విచార మగుచున్నది. ఏతద్వ్యాస రచయిత, (శ్రీ) వేంకటాచలము గారు సహజప్రతిభావంతులు; బహుభాషాపాండిత్యము, వివిధవిషయ పరిజ్ఞానము గలవారు. వాఙ్మయతత్త్వపరిశోధనమున నారితేరిన చేయి. వీరి యపూర్వపరిశోధనఫలములగు ననేకవ్యాసములాంగ్లపత్రికలయందు ప్రకటితము లయినవి. వానివలని లాభము నాంగ్లభాషాభిజ్ఞులు పొందగలిగిరి. ఆంగ్లానభిజ్ఞమగు నాంధ్ర లోకమునకును తల్లాభమును బంచి పెట్ట భారతి పూనుకొనినది. ప్రకటితములయిన వ్యాసముల విలువ యాంధ్రవిద్వల్లోకమునకు సువిదితము. ఈతీరు పరిశోధనము సంస్కృతాంధ్రవాఙ్మయతత్త్వనిర్ణయమునకు పరమావశ్యకము, పరమోపకారకము. ఇంకను వీరి వ్యాసములను పెక్కింటిని ప్రకటించి చిరకాల మాంధ్రవాఙ్మయసేవ చేయ భారతి యాశించుచుండినది. ఇంతలో నీవిజ్ఞానధనుడు దైవదుర్విపాకమున హఠాత్తుగ లోకాంతరగతు డయ్యెను. అమూల్యవిజ్ఞాన మంతరించినది; భారతి హతాశ నైనది; వాఙ్మయమునకు తీరని కొఱత ప్రాప్తమయినది. ఇక నిట్టి యమూల్య వాఙ్మయ పరిశోధనము దుర్లభము.

* * * *

విజయవిలాసము :

విపులవ్యాఖ్యానావశ్యకత

పదునేడవశతాబ్ది పూర్వార్ధమున తంజాపుర రాజ్యమును పరిపాలించిన రఘునాథభూపాలుని యాస్థానము సంస్కృతాంధ్రసాహిత్యకేదారమయి అమూల్యములగు నసంఖ్యాకగ్రంథముల మేలిపంటలను బండినది. అందు చేమకూర వేంకటపతి, మృదుమధురకవితారసామృతమును పారించి ప్రోదిచేసిన యాంధ్రవాఙ్మయకల్పలత పండిన తీయనిపండులు విజయవిలాస, సారంగధరచరిత్ర కృతులు. కావుననే రసికవతంసములగు సుధీమణులు చేమకూర వేంకటపతిని కడుంగడు మెచ్చి 'అమృతపుంగూర' వేంకటపతి యని సుగృహీతనాముని జేసి యాంధ్రవాఙ్మయప్రపంచ

మున నున్నతపదము నలంకరింపజేసినారు. పై రెండుకృతులయందును విజయవిలాసమురసోత్తరము. కేవల మీరెంటనే కాదు; ఆంధ్రవాఙ్మయమున గల ప్రబంధము లన్నిటిలో నిట్టి దిక నొకటిలేమి సత్యము. ఈసత్యము రసికజనైకవేద్యము. ఇందలి యర్థచమత్కారము, అలంకారసంపద, పదగుంభనపరమార్థము, భావగాంభీర్యము, విశేషజ్ఞులగు విద్వాంసుల నిశితబుద్ధికినయితము సుగ్రహము కాని దయియుండ సామాన్యులమాట చెప్పబనిలేదు. ఇప్పటి కీప్రబంధమునకు మహోపాధ్యాయ, కళాప్రపూర్ణబిరుదాంకితులగు శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారు రచియించి ప్రకటించిన లఘువ్యాఖ్యానముమాత్రమే కలదు. ఎల్లరును సాకల్యముగ నేతత్కావ్యామృతరసాస్వాదము గావించి యానందింపవలయునన్న నీలఘువ్యాఖ్యానము చాలునది కాదు. విపులమగు వ్యాఖ్యాన మొండొకటి యత్యంతము నావశ్యకము.

ప్రతిభావంతులగు 'ఆంధ్రవిశారద' శ్రీ తాపీ ధర్మారావు (బి. ఏ.) గారు విజయవిలాసము నందలి యెల్లచమత్కృతులను వివరించుచు విపులమగు వ్యాఖ్యానమును రచియించుచున్నట్లును, ఆవ్యాఖ్యానముయొక్క విధానమునుగూర్చియు చెన్నపురాంధ్ర మహాసభయాధిపత్యమున నిటీవలమూడునాలుగుమారు లుపన్యసించినారు. ఉపన్యస్త విషయము నాంధ్రపత్రికలు ప్రకటించినవి. భారతి యీసంచికయందును నొక్కపద్యమువ్యాఖ్యానము ప్రకటితమయినది. దీనివలన వ్యాఖ్యానప్రాశస్త్యమును సహృదయలోకము గుర్తింపగలదు. వ్యాఖ్యానము ప్రకటనమే తరవాయిగా నున్నట్లు తెలియవచ్చుట మహదానందదాయకము. ఈ యుత్కృష్టకార్యము గావించి యాంధ్రవాఙ్మయమునకు బరమోపకార మొనరింప బూనిన శ్రీ ధర్మారావుగారి నెట్టు లెంత యభినందించవలయుననుట యెఱిగి యట్టులంత యభినందించుట రసజ్ఞుల కార్యము.

అంతతో ఆంధ్రలోకముపని తీరునదికాదు. ఈ వ్యాఖ్యానము సంపూర్ణమయి ప్రకటితము కాజాలవలయును. ఇది విద్యాభిమానులగు సంపన్నుల యాదరణమువలన కావలసినపని.

ఆంధ్రదేశమున సంస్థానాధీశ్వరులు, తదితరులగు శ్రీమంతులు పలువురు గలరు. వారికి పాండిత్యమునను, పండితాదరణమునను, వాఙ్మయపోషణాసక్తియందును కొఱంత యుండబోదు. కాని యితర సామాన్యవినోదములయందుగల యుత్సాహము విద్యావినోదములందు కానరాదు. ఏవి తమయశస్సును వాఙ్మయమున్నంత కాలము చిరస్థాయినిగా నొనరించి తమ్ము ధన్యజీవనులనుగ జేయునో, యట్టి విద్యావినోదములయెడ నుత్సాహము కొఱవడుట సముచితమని తలపజనదు.

ఆదికాలముననుండి వాఙ్మయము మహారాజుల సాదర పోషణముమూలముననే తామరతంపరనై పెంపొందుటను వాఙ్మయచరిత్ర చాటుచున్నది. అట్లు భవిష్యచ్చరిత్రమున

కెక్కదగిన యభివృద్ధి నేటికాలమున నత్యల్పముగ గాన్పించును. కృతి సత్పసంతానములలో నొకటి. కావుననే నాడు మహారాజులు కవులను వెదకినైన రప్పించి, తమపోషణమున మనిచి, వారిచే కృతుల నందెడివారు. నేడు తమకడకు తమంత కవులే వెదకికొనివచ్చి 'కృతుల నిచ్చెదము, గైకొను'డని వేడుకొనినను పెడమొగము పెట్టుదురు. నేడు వాఙ్మయమునకు వచ్చిన దురవస్థ యిట్టిది! వెనుకటికాలమున వెలసిన ప్రబంధము లనేకములు వ్యాఖ్యానాపేక్షములయి యుండుట సర్వజనవిదితము. వానికి సుగమము లగునట్లు వ్యాఖ్యానములను సమర్థులగు పండితులచే రచియింపించియైన తమ కీర్తి చరిత్రప్రసిద్ధముగునట్లు మహారాజులు సాధించుకొనుట సముచితము.

ప్రకృతము శ్రీధర్మారావుగారి పాండిత్యప్రతిభావిశేషముల ఫలముగ నుపలబ్ధమగుచున్నది విజయవిలాసవ్యాఖ్యానము. అన్యాదరణ పోషణములు వినా వ్యాఖ్యారచనము జరిగినది. ప్రకటన మట్టిది కాదు; బహుళవ్యయమూలకము. ఆర్యసంప్రదాయమునకు దగని వినోదములకు, విదేశయాత్రలకు నేడు ఆంధ్రదేశ సంస్థానాధీశులధనము లక్షలకొలది వ్యయమగుచున్నది. అందు శతాంశమైన విద్యావినోదమునకు మరలిన విజయవిలాసవ్యాఖ్యానము సకలాంధ్రలోకమునకు లభింపగలదు. ఇది యొక్కటియే కాదు. ఇట్టి వెన్నియేని లభింపగలవు. కాన సంస్థానాధీశ్వరులేని, శ్రీమంతులేని యీవ్యాఖ్యానమును వెలయింపజేసి, తమ నామమును, వ్యాఖ్యాతృనామమును చరిత్రమున సువర్ణాంకితములుగా జేసి యాంధ్రలోకము కృతజ్ఞతకు పాత్రులు కాదగుదురు.

---

Printed and Published by C. Seshagiri Rao, B.A., at the Andhra Patrika Press, No 7, ThambuChetty St., Madras
Editor: G. Subbaramayya